శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః ఆదిత్యాత్మనా సర్వప్రాణిజాల ముద్భోధయతి భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః చంద్రాత్మనా దేమనువ్యజాలమాహ్లాదయతి భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః సర్వస్త్రీరూపిణీ భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః సర్వపురుషాత్మకం భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః సర్వతిర్యక్ స్థావరాత్మకం బ్రహ్మ భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః మాతృకా రూపిణీ మాహ్లాదయతి భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః గాయత్రీ స్వరూపిణీ భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః సర్వవేదాః సాంగాః సశాఖాః సపురాణాః భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః యచ్చ సర్వం బ్రహ్మాండాంతర్ బహిర్ వ్యాప్యస్థితం భూర్భువస్సువ స్తస్త్యై నమోనమః
శ్రీం హ్రీం క్లీం యాలక్ష్మీః తారకం బ్రహ్మజా భూర్భువస్సువస్తస్త్యై నమోనమః

ఏతైర్మంత్రైః సత్సుతా మహాలక్ష్మీః ప్రీతాభవతి
అష్టమాసా దూర్ధ్వం స్వాత్మానం దర్శయతి
ఐహికాముష్మికం మోక్షందదాతి ।
ఓం మహాదేవ్యైచ విద్మహే విష్ణు పత్నైచ ధీమహి
తన్నోలక్ష్మీః ప్రచోదయాత్
శ్రీం హ్రీం క్లీం శ్రీ మహాలక్ష్మైనమః

# దేవ్యుపనిషత్తు

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామదేవాః భద్రం పశ్యేమా క్షభిర్య
జత్రాః స్థిరై రంగై స్తుష్టువాగ్ంస స్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతిర్దధాతు -

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సర్వేవై దేవాదేవీ ముపతస్థుః । కాసి త్వం మహాదేవిః సాఽబ్రవీదహం బ్రహ్మస్వరూపిణీ । మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్ ॥ శూన్యం చా శూన్యంచ అహ మానందానా నందాః । అహం విజ్ఞానా విజ్ఞానే । అహం - బ్రహ్మా బ్రహ్మణీ వేదితవ్యే । ఇత్యాహా థర్వశ్రుతిః ॥ అహం పంచభూతా న్యపంచ భూతాని । అహమఖిలం జగత్ । వేదోహ మవేదోఽహం ॥ విద్యాహ మవిద్యాహం । అజాహ మన జాహం । అథశ్చోర్ధ్వంచ తిర్యక్చాహం ।

అహగ్ం రుద్రేభి ర్వసుభిశ్చరామ్యహ మాదిత్యైరుత విశ్వదేవైః అహం మిత్రావరుణా వుభభి భర్మ్యహమింద్రాగ్నీ । అహ మశ్వినా వుభౌ । అహగ్ం సోమంత్వష్టారం పూషణం భగం దదామ్యహం । విష్ణు మురుక్రమం బ్రహ్మాణముత ప్రజాపతిం దధామి ।అహం దధామి ద్రవిణగ్ం హవిష్మతే సుప్రావ్యే యే యజమానాయ సున్వతే । అహగ్ం రాష్ట్రీం సంగమనీ వసూనా మహగ్ం సువే పితరమస్య మూర్ధన్ ॥ మమ యోనిరప్స్వంత స్సముద్రే య ఏవంవేద । సదేవీపద మాప్నోతి । తే దేవా అబ్రువన్ । నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః । నమః ప్రకృత్యైభద్రాయై నియతాః ప్రణతాః స్మతాం - తామగ్ని వర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం కర్మఫలేషు జుష్టాం । దుర్గాం దేవీగ్ం శరణ మహం ప్రపద్యే సుతరాం నాశయతే తమః॥ దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవో వదంతి । సానో మంద్రేష మూర్జం దుహానా ధేను ర్వా గస్మానుపసుష్టుతైతు । కాళరాత్రీం బ్రహ్మస్తుతాం వైష్ణవీగ్ం స్కందమాతరం సరస్వతీ మదితం దక్షదుహితరం నమామః పావనాగ్ం శివాం । మహాలక్ష్మీ చ విద్మహే సర్వసిద్ధీ చ ధీమహితన్నోదేవీ ప్రచోదయాత్ ॥ అదిత రిహ జనిష్ట దక్షయా దుహితా తవతాం దేవా అన్వజాయంత భద్రా అమృత బిందవః । కామో యోనిః కామకలా వజ్రపాణిర్గుహాహసా మాతరిశ్వాభ్ర మింద్రః పునర్గుహా సకలా మాయాయాచ పునః కోశావిశ్వమాతాది విద్యోం । ఏషాత్మశక్తి రేషా విశ్వమోహినీ పాశాంకుశ ధనుర్బాణ ధరా ఏషా శ్రీమహావిద్యా య ఏవం వేద । నశోకం తరతి । నమస్తే అస్తు భగవతి మాతరస్మా న్పాతు సర్వతః సైషాష్టౌ వసవ స్సైషాకా దశరుద్రా స్సైషా ద్వాదశా దిత్యా స్సైషా విశ్వే దేవా స్సోమపా అసోమపాశ్చ । స్సైషా యాతుధానా అసురా రక్షాగ్ంసి పిశాచా యక్షా సిద్ధాస్సైషా సత్వ రజస్త మాగ్ంసి । సైషా ప్రజాపతీంద్ర మనవః । సైగ్రహనక్షత్ర జ్యోతీగ్ంషి కలకాష్టాది కాలరూపిణీ తామహం ప్రణౌమి నిత్యం। తాపాప హారిణీం దేవీం భుక్తి ముక్తి ప్రదాయినీం। అనంతాం విజయాగ్ం శుద్ధాం శరణ్యాగ్ం శివదాగ్ం శివాం । విజయదేకార సంయుక్త వీతిహోత్ర సమన్వితమ్ అర్ధేందు లసితం దేవ్యా భీజగ్ం సర్వార్థసాధకమ్ । ఏన మేకాక్షరం మంత్రం యతయ శ్శుద్ధచేతనః ధ్యాయంతి పరమానందమయా జ్ఞానాంబు రాశయః । వాఙ్మయీ బ్రహ్మ భూస్తస్మాత్ షష్ఠం వక్త్ర సమన్వితం । సూర్యో వామ శ్రోత్ర బిందు స్సంయత్యష్ట తృతీయకః నారాయణేన సంయుక్తో వాయు శ్చాధర సంయుతః । విచ్చేణవార్ణకోణస్స్యా న్మహ దానందదాయకః । హృత్పుండరీక మధ్యస్థాం ప్రాత స్సూర్య సమప్రభామ్ పాశాంకుశ ధరాగ్ం సౌమ్యాం వరదాభయ హస్తకామ్ । త్రినేత్రాగ్ం రక్తవసనాం భక్త కామ

దర్ఘూంభజే । నమామి త్వాం అహందేవి మహాభయ వినాశనీం మహాదుర్గ ప్రశమనీం మహాకారుణ్య రూపిణీం యస్యా స్స్వరూపం బ్రహ్మాదయో సజానంతి తస్మాదుచ్యతేఽజ్ఞేయా యస్యా అంతో నవిద్యతే । తస్మా దుచ్యతే అనంతా యస్యా గ్రహణం నోప లభ్యతే । తస్మా దుచ్యతే అలక్ష్యా యస్యా జననం నోపలభ్యతే తస్మా దుచ్యత ఆజా ఏకైవ సర్వత్ర వర్తతే । తస్మా దుచ్యత ఏకా ఏకైవ విశ్వరూపిణీ । తస్మా దుచ్యతే నైకా అత ఏవోచ్యతే । ఆజ్ఞేయానంతా లక్ష్మ్యైనైకేతి మంత్రాణాం మాతృకాదేవీ శబ్దానాం జ్ఞానరూపిణీం జ్ఞానానాం చిన్మయాతీతా శూన్యానాగ్ం శూన్యసాక్షిణీ । యస్యాః పరతరం నాస్తిసైషా దుర్గా ప్రకీర్తితా । దుర్గాత్సంత్రాయతే యాస్మాద్దేవీ దుర్గేతి కథ్యతే ప్రపద్యే శరణం దేవీం దుం దుర్గే దురితం హరతాం దుర్గా దుర్గమాం దేవీం దురాచార విఘాతి నీమ్ । నమామి భవ భీతోఽహగ్ం సం సారార్ణవతారిణీం। ఇద మథర్వశీర్షం యోధీతే సపంచాథర్వణశీర్ష జపఫలం ఆప్నోతి । ఇద మథర్వశీర్షం అజ్ఞాత్వా యో అర్చాగ్ం స్థాపయతి శత లక్షం జప్త్వాపి సార్చా సిద్ధించ విందతి । శత మష్టోత్తరం చాస్యాః పురశ్చర్యా విధి స్స్మృతః । దశవారం పఠే ద్యస్తు సద్య పాపైః ప్రముచ్యతే । మహాదుర్గాణి తరతి మహాదేవ్యాః ప్రసాదతః। ప్రాతరధీ యానో రాత్రికృతం పాపం నాశయతి । సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి । తత్సాయం ప్రాతః ప్రయుంజానః పాపో అపాపో భవతి । నిశీథే తురీయ సంధ్యాయాం జప్త్వా వాక్సిద్ధిర్భవతి । నూతన ప్రతిమాయాం జప్త్వాదేవతా సాన్నిధ్యం భవతి । ప్రాణ ప్రతిష్ఠాయాం జప్త్వా ప్రాణానాం ప్రతిష్ఠాభవతి । భౌమాశ్విన్యాం మహాదేవీ సన్నిధౌ జప్త్వా మహామృత్యుం తరతి । మహామృత్యుం తరతి । య ఏవం వేద ఇత్యుపనిషత్ ॥

శుద్ధోదక స్నానం - ఆపో హిష్ఠామయో భువ స్తాన ఊర్జే దధాతన, మహేరణాయ చక్షసే, యోవ శ్శివతమోరస స్తస్య భాజయతేహనః, ఉశతీరివ మాతరః, తస్మా అరంగమామవో యస్య క్షయాయ జిన్వథ, ఆపో జనయథాచనః. శ్లో. నదీనాం చైవ సర్వాసామానీతం నిర్మలోదకం, స్నానం స్వీకురుదేవేశ మయాదత్తం సురేశ్వర. శ్రీ సత్యనారాయణస్వామినే నమః. శుద్ధోదక స్నానం సమర్పయామి.

వస్త్రం - సప్తాస్యాసన్పరిధయః. త్రిస్సప్తసమిధః కృతాః, దేవాయద్యజ్ఞం తన్వానాః, అబధ్నన్పురుషం పశుం. శ్లో. వేదసూక్త సమాయుక్తే. యజ్ఞసామ సమన్వితే, సర్వవర్ణప్రదే దేవి వాససీ తే వినిర్మితే. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

యజ్ఞోపవీతం - తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్, పురుషం జాతమగ్రతః తేన దేవా అయజంత, సాధ్యా ఋషయశ్చయే. శ్లో. బ్రహ్మవిష్ణు మహేశానాం నిర్మితం బ్రహ్మసూత్రకం, గృహాణ భగవన్ విష్ణో సర్వేష్ట ఫలదో భవ. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

గంధం - తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః, సంభృతం పృషదాజ్యం, పశూగ్ స్తాగ్ శ్చక్రే వాయవ్యాన్, అరణ్యాన్ గ్రామ్యాశ్చయే. శ్లో. శ్రీఖండం, చందనం దివ్యం గంధాఢ్యం సమనోహరం, విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః. దివ్యశ్రీ చందనం సమర్పయామి.

ఆభరణం - తస్మాద్యజ్ఞా త్సర్వ హుతః, ఋచస్సామాని జజ్ఞిరే, ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్, యజుస్తస్మాదజాయత. శ్లో. హిరణ్య హారకేయూర గ్రైవేయ మణికంకణైః, సుహారం భూషణై ర్యుక్తం గృహాణ పురుషోత్తమ. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః. ఆభరణం సమర్పయామి.

పుష్పం - తస్మా దశ్వా అజాయంత, యేకే చోభయా దతః, గావోహ జజ్ఞిరే తస్మాత్, తస్మా జ్జాతా అజావయః. శ్లో. మల్లికాది సుగంధీని మాలత్యాదీని వై ప్రభో, మాయాహృతాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యతాం. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః. పుష్పం సమర్పయామి.

## అథాంగ పూజా

ఓం కేశవాయ నమః పాదౌ పూజయామి, ఓం గోవిందాయ నమః గుల్ఫౌ పూజయామి, ఓం ఇందిరాపతయే నమః జంఘే పూజయామి, ఓం అనఘాయ నమః జానునీ పూజయామి, ఓం జనార్దనాయనమః ఊరూ పూజయామి, ఓం విష్టర శ్రవసే నమః కటిం పూజయామి, ఓం కుక్షిస్థాఖిల భువనాయ నమః ఉదరం పూజయామి, ఓం లక్ష్మీ వక్షస్థలాలయాయనమః వక్షస్థలం పూజయామి, ఓం శంఖచక్రగదాశార్ఙ్గపాణయే నమః బాహూన్ పూజయామి, ఓం కంబుకంఠాయ నమః కంఠం పూజయామి, ఓం పూర్ణేందు నిభవక్త్రాయ నమః వక్త్రం పూజయామి, ఓం కుందకుట్మలదంతాయ నమః దంతాన్పూజయామి, ఓం నాసాగ్రమౌక్తికాయ నమః నాసికాం పూజయామి, ఓం సూర్యచంద్రాగ్ని ధారిణే నమః నేత్రే పూజయామి, ఓం సహస్ర శిరసే నమః శిరఃపూజయామి, ఓం శ్రీ సత్యనారాయణస్వామినే నమః సర్వాణ్యంగాని పూజయామి.

# అష్టోత్తర శతనామ పూజా

ఓం శ్రీ సత్యనారాయణ నమః

ఓం శ్రీ ఆది నారాయణ నమః
ఓం శ్రీ ఐక్య నారాయణ నమః
ఓం శ్రీ అస్థి నారాయణ నమః
ఓం శ్రీ బాల నారాయణ నమః
ఓం శ్రీ భాను నారాయణ నమః
ఓం శ్రీ బంధు నారాయణ నమః
ఓం శ్రీ భావ నారాయణ నమః
ఓం శ్రీ భద్ర నారాయణ నమః
ఓం శ్రీ భవ్య నారాయణ నమః
ఓం శ్రీ భ్రమ నారాయణ నమః
ఓం శ్రీ భృత్య నారాయణ నమః
ఓం శ్రీ భోక్త నారాయణ నమః
ఓం శ్రీ భుక్తి నారాయణ నమః
ఓం శ్రీ బ్రహ్మ నారాయణ నమః
ఓం శ్రీ బుద్ధి నారాయణ నమః
ఓం శ్రీ దయ నారాయణ నమః
ఓం శ్రీ దీప్తి నారాయణ నమః
ఓం శ్రీ ధీక్ష నారాయణ నమః
ఓం శ్రీ ధరా నారాయణ నమః
ఓం శ్రీ ధీర నారాయణ నమః
ఓం శ్రీ ధేను నారాయణ నమః
ఓం శ్రీ దివ్య నారాయణ నమః
ఓం శ్రీ దుర్గ నారాయణ నమః
ఓం శ్రీ ఏకో నారాయణ నమః
ఓం శ్రీ గౌరీ నారాయణ నమః
ఓం శ్రీ గాన నారాయణ నమః
ఓం శ్రీ గమ్య నారాయణ నమః
ఓం శ్రీ గంగ నారాయణ నమః
ఓం శ్రీ గతి నారాయణ నమః
ఓం శ్రీ గౌన నారాయణ నమః
ఓం శ్రీ హరి నారాయణ నమః
ఓం శ్రీ హర నారాయణ నమః
ఓం శ్రీ హాస్య నారాయణ నమః
ఓం శ్రీ ఇచ్ఛ నారాయణ నమః
ఓం శ్రీ ఇష్ట నారాయణ నమః
ఓం శ్రీ జరా నారాయణ నమః
ఓం శ్రీ జీవ నారాయణ నమః
ఓం శ్రీ కాల నారాయణ నమః
ఓం శ్రీ కృష్ణ నారాయణ నమః
ఓం శ్రీ కృప నారాయణ నమః
ఓం శ్రీ కార్య నారాయణ నమః
ఓం శ్రీ కావ్య నారాయణ నమః
ఓం శ్రీ క్రతు నారాయణ నమః
ఓం శ్రీ కుక్షి నారాయణ నమః
ఓం శ్రీ కాంతి నారాయణ నమః
ఓం శ్రీ లీల నారాయణ నమః
ఓం శ్రీ మాతృ నారాయణ నమః
ఓం శ్రీ మహా నారాయణ నమః
ఓం శ్రీ మేధా నారాయణ నమః
ఓం శ్రీ మిత్ర నారాయణ నమః

ఓం శ్రీ మోహ నారాయణ నమః
ఓం శ్రీ నర నారాయణ నమః
ఓం శ్రీ నిధి నారాయణ నమః
ఓం శ్రీ ఓం నారాయణ నమః
ఓం శ్రీ పద్మా నారాయణ నమః
ఓం శ్రీ ప్రాప్తి నారాయణ నమః
ఓం శ్రీ పుష్టి నారాయణ నమః
ఓం శ్రీ శివ నారాయణ నమః
ఓం శ్రీ సుధా నారాయణ నమః
ఓం శ్రీ శశి నారాయణ నమః
ఓం శ్రీ శ్రీమాన్ నారాయణ నమః
ఓం శ్రీ శౌర్య నారాయణ నమః
ఓం శ్రీ సాక్షి నారాయణ నమః
ఓం శ్రీ సూర్య నారాయణ నమః
ఓం శ్రీ స్వర నారాయణ నమః
ఓం శ్రీ సిధ నారాయణ నమః
ఓం శ్రీ సుధా నారాయణ నమః
ఓం శ్రీ సేవా నారాయణ నమః
ఓం శ్రీ సౌఖ్య నారాయణ నమః
ఓం శ్రీ సేతు నారాయణ నమః
ఓం శ్రీ సాధు నారాయణ నమః
ఓం శ్రీ స్వర్ణ నారాయణ నమః
ఓం శ్రీ తృప్తి నారాయణ నమః
ఓం శ్రీ వీర నారాయణ నమః
ఓం శ్రీ వాయు నారాయణ నమః
ఓం శ్రీ విశ్వ నారాయణ నమః
ఓం శ్రీ వర నారాయణ నమః
ఓం శ్రీ వస్త్ర నారాయణ నమః
ఓం శ్రీ యశి నారాయణ నమః

ఓం శ్రీ ముక్తి నారాయణ నమః
ఓం శ్రీ నవ్య నారాయణ నమః
ఓం శ్రీ నృత్య నారాయణ నమః
ఓం శ్రీ పశు నారాయణ నమః
ఓం శ్రీ పితృ నారాయణ నమః
ఓం శ్రీ ప్రియా నారాయణ నమః
ఓం శ్రీ రవి నారాయణ నమః
ఓం శ్రీ శ్యామ నారాయణ నమః
ఓం శ్రీ శైల నారాయణ నమః
ఓం శ్రీ శాంత నారాయణ నమః
ఓం శ్రీ శూర నారాయణ నమః
ఓం శ్రీ శక్తి నారాయణ నమః
ఓం శ్రీ సౌమ్య నారాయణ నమః
ఓం శ్రీ స్వామి నారాయణ నమః
ఓం శ్రీ సుఖా నారాయణ నమః
ఓం శ్రీ సాధ్య నారాయణ నమః
ఓం శ్రీ స్థిర నారాయణ నమః
ఓం శ్రీ సూక్తి నారాయణ నమః
ఓం శ్రీ సింధు నారాయణ నమః
ఓం శ్రీ సత్య నారాయణ నమః
ఓం శ్రీ స్నేహ నారాయణ నమః
ఓం శ్రీ తేజో నారాయణ నమః
ఓం శ్రీ తత్వ నారాయణ నమః
ఓం శ్రీ విష్ణు నారాయణ నమః
ఓం శ్రీ వైద్య నారాయణ నమః
ఓం శ్రీ వ్యూహ నారాయణ నమః
ఓం శ్రీ వర్ష నారాయణ నమః
ఓం శ్రీ వాచ్య నారాయణ నమః
ఓం శ్రీ యశో నారాయణ నమః

# శ్రీ అనంత లక్ష్మి అష్టోత్తర శతనామ పూజా

ఓం శ్రీ అనంతలక్ష్మైనమః

ఓం శ్రీ అగ్ని లక్ష్మై నమః
ఓం శ్రీ అష్టలక్ష్మై నమః
ఓం శ్రీ అన్న లక్ష్మై నమః
ఓం శ్రీ ఆత్మా లక్ష్మై నమః
ఓం శ్రీ భోగ లక్ష్మై నమః
ఓం శ్రీ భోగ్య లక్ష్మై నమః
ఓం శ్రీ ధన లక్ష్మై నమః
ఓం శ్రీ ధాన్య లక్ష్మై నమః
ఓం శ్రీ ధర్మ లక్ష్మై నమః
ఓం శ్రీ ధాత్రు ల నమః
ఓం శ్రీ ద్రవ్య నమః
ఓం శ్రీ దాన ల నమః
ఓం శ్రీ గీతా లక్ష్మై నమః
ఓం శ్రీ గ్రహా లక్ష్మై నమః
ఓం శ్రీ గృహా లక్ష్మై నమః
ఓం శ్రీ ఇంద్ర లక్ష్మై నమః
ఓం శ్రీ జయ లక్ష్మై నమః
ఓం శ్రీ జ్ఞాతృ లక్ష్మై నమః
ఓం శ్రీ జ్వాలా లక్ష్మై నమః
ఓం శ్రీ కామ ల నమః
ఓం శ్రీ కళా లక్ష్మై నమః
ఓం శ్రీ కర్తా లక్ష్మై నమః
ఓం శ్రీ కర్మా లక్ష్మై నమః
ఓం శ్రీ కాంతి లక్ష్మై నమః
ఓం శ్రీ క్షమా లక్ష్మై నమః
ఓం శ్రీ క్షాంతి లక్ష్మై నమః

ఓం శ్రీ అర్ఘ్య లక్ష నమః
ఓం శ్రీ అధో లక్ష నమః
ఓం శ్రీ ఆశా లక్ష్మై నమః
ఓం శ్రీ బిందు లక్ష్మై నమః
ఓం శ్రీ భాగ్య లక్ష్మై నమః
ఓం శ్రీ భ్రాంతి లక్ష్మై నమః
ఓం శ్రీ ధన్య లక్ష్మై నమః
ఓం శ్రీ ధైర్య లక్ష్మై నమః
ఓం శ్రీ ధ్యాన లక్ష్మై నమః
ఓం శ్రీ ధ్యేయ లక్ష్మై నమః
ఓం శ్రీ దీప లక్ష్మై నమః
ఓం శ్రీ గజ లక్ష్మై నమః
ఓం శ్రీ ఘన లక్ష్మై నమః
ఓం శ్రీ గ్రంధి లక్ష్మై నమః
ఓం శ్రీ గురు లక్ష్మై నమః
ఓం శ్రీ జపా లక్ష్మై నమః
ఓం శ్రీ జ్ఞాన లక్ష్మై నమః
ఓం శ్రీ జ్ఞేయ లక్ష్మై నమః
ఓం శ్రీ జ్యోతి లక్ష్మై నమః
ఓం శ్రీ కన్యా లక్ష్మై నమః
ఓం శ్రీ కామ్య లక్ష్మై నమః
ఓం శ్రీ క్రియా లక్ష్మై నమః
ఓం శ్రీ కీర్తి లక్ష్మై నమః
ఓం శ్రీ ఖ్యాతి లక్ష్మై నమః
ఓం శ్రీ క్షేమ లక్ష్మై నమః
ఓం శ్రీ క్షేత్ర లక్ష్మై నమః

ఓం శ్రీ లక్ష్య లక్ష్మై నమః
ఓం శ్రీ మోక్ష లక్ష్మై నమః
ఓం శ్రీ నాద లక్ష్మై నమః
ఓం శ్రీ నాట్య లక్ష్మై నమః
ఓం శ్రీ నిత్య లక్ష్మై నమః
ఓం శ్రీ పత్ర లక్ష్మై నమః
ఓం శ్రీ పూజ్య లక్ష్మై నమః
ఓం శ్రీ ప్రీతి లక్ష్మై నమః
ఓం శ్రీ ప్రభాలక్ష్మై నమః
ఓం శ్రీ పుత్ర లక్ష్మై నమః
ఓం శ్రీ పుష్ప లక్ష్మై నమః
ఓం శ్రీ రాధా లక్ష్మై నమః
ఓం శ్రీ రామ లక్ష్మై నమః
ఓం శ్రీ రమా లక్ష్మై నమః
ఓం శ్రీ శాంత లక్ష్మై నమః
ఓం శ్రీ శుభా లక్ష్మై నమః
ఓం శ్రీ శేష లక్ష్మై నమః
ఓం శ్రీ సంధ్యా లక్ష్మై నమః
ఓం శ్రీ సీతా లక్ష్మై నమః
ఓం శ్రీ సోమ లక్ష్మై నమః
ఓం శ్రీ త్యాగ లక్ష్మై నమః
ఓం శ్రీ తపో లక్ష్మై నమః
ఓం శ్రీ తీర్థ లక్ష్మై నమః
ఓం శ్రీ ఊర్ధ్వ లక్ష్మై నమః
ఓం శ్రీ వేద్య లక్ష్మై నమః
ఓం శ్రీ విజయ లక్ష్మై నమః
ఓం శ్రీ వాద్య లక్ష్మై నమః
ఓం శ్రీ యోగ్య లక్ష్మై నమః
ఓం శ్రీ మంత్ర లక్ష్మై నమః
ఓం శ్రీ మాయ లక్ష్మై నమః
ఓం శ్రీ నాగ లక్ష్మై నమః
ఓం శ్రీ నీతి లక్ష్మై నమః
ఓం శ్రీ న్యాయ లక్ష్మై నమః
ఓం శ్రీ ఫల లక్ష్మై నమః
ఓం శ్రీ పూర్ణ లక్ష్మై నమః
ఓం శ్రీ ప్రేమ లక్ష్మై నమః
ఓం శ్రీ ప్రాణ లక్ష్మై నమః
ఓం శ్రీ పుణ్య లక్ష్మై నమః
ఓం శ్రీ రాజ లక్ష్మై నమః
ఓం శ్రీ రాజ్య లక్ష్మై నమః
ఓం శ్రీ రాగ లక్ష్మై నమః
ఓం శ్రీ రమ్య లక్ష్మై నమః
ఓం శ్రీ శ్రద్ధా లక్ష్మై నమః
ఓం శ్రీ శోభా లక్ష్మై నమః
ఓం శ్రీ సత్య లక్ష్మై నమః
ఓం శ్రీ సాయి లక్ష్మై నమః
ఓం శ్రీ స్వాహా లక్ష్మై నమః
ఓం శ్రీ సుధా లక్ష్మై నమః
ఓం శ్రీ తంత్ర లక్ష్మై నమః
ఓం శ్రీ తుష్టి లక్ష్మై నమః
ఓం శ్రీ ఉగ్ర లక్ష్మై నమః
ఓం శ్రీ వేద లక్ష్మై నమః
ఓం శ్రీ విద్యా లక్ష్మై నమః
ఓం శ్రీ వసు లక్ష్మై నమః
ఓం శ్రీ యోగ లక్ష్మై నమః
ఓం శ్రీ యంత్ర లక్ష్మై నమః

శ్రీ అనంతలక్ష్మీ సమేత సత్యనారాయణ స్వామినే నమః
నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి.

ధూపం : యత్పురుషం వ్యదధుః, కతిధావ్యకల్పయన్, ముఖం కిమస్య కౌ బాహూ, కావూరూ పాదావుచ్యేతే. శ్లో. దశాంగం గుగ్గులోపేతం సుగంధీం సుమనోహరం, ధూపం గృహాణ దేవేశ సర్వదేవనమస్కృత, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః ధూప మాఘ్రాపయామి.

దీపం : బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూరాజన్యః కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత. శ్లో. ఘృతాక్తవర్తిసంయుక్తం వహ్నినా యోజితం ప్రియం, దీపం గృహాణ దేవేశ త్రైలోక్య తిమిరాపహమ్. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః దీపం దర్శయామి.

నైవేద్యం : చంద్రమామనసోజాతః, చక్షో స్సూర్యో అజాయత, ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ, ప్రాణా ద్వాయురజాయత. శ్లో. సౌవర్ణస్థాలిమధ్యే మణిగణఖచితే గోఘృతాక్తాన్ సుపక్వాన్ భక్ష్యాన్ భోజ్యాంశ్చ లేహ్యానపరిమితరసాన్ చోష్యమన్నం నిధాయ, నానాశాకైరుపేతం దధిమధు సగుడక్షీరపానీయయుక్తం తాంబూలం చాపి విష్ణోః ప్రతిదివసమహం మానసే కల్పయామి. రాజాన్నం సూపసంయుక్తం శాకచోష్య సమన్వితం, ఘృతభక్ష్యసమాయుక్తం నైవేద్యం ప్రతి గృహ్యతామ్. ఓం భూర్భువస్సువః, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి, అమృతమస్తు, అమృతోపస్తరణమసి, ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, ఓం బ్రహ్మణేస్వాహా, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, మహా నైవేద్యం సమర్పయామి. అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

తాంబూలం : నాభ్యాఆసీదంతరిక్షం, శీర్ష్ణో ద్యౌస్సమ వర్తత, పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్, తథా లోకాగ్ం అకల్పయన్. శ్లో. పూగీఫలై స్సకర్పూరై-ర్నాగవల్లీదళైర్యుతం, ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః తాంబూలం సమర్పయామి.

నీరాజనం : వేదాహమేతం పురుషం మహాంతం, ఆదిత్యవర్ణం తమసస్తు పారే, సర్వాణి రూపాణి విచిత్య ధీరః, నామాని కృత్వాஉభివదన్ యదాస్తే. నర్వప్రజాం మే గోపాయ అమృతత్వాయ జీవసే, జాతాం జనిష్యమాణాం చ అమృతే సత్యే ప్రతిష్ఠితాం, అథర్వపితుం మే గోపాయ రసమన్న మిహాయుషే, అబద్ధాయో శితతనో అవిషం నః పితుం కృణు శగ్స్య పశూన్ మే గోపాయ ద్విపాదో యే చతుష్పదః, అష్టాశఫాశ్చ, య ఇహాగ్నే మే చైకశఫా ఆశుగాః స ప్రథ సభాం మే గోపాయ. యే చ సభ్యాస్సభాసదః, తానింద్రియా వతః కురు

సర్వమాయురుపాసతాం. అహే బుధ్నియ మంత్రం మే గోపాయ యమృషయ స్త్రైవిదా విదుః, ఋచస్సామాని యజూగ్ంషి సాహి శ్రీ రమృతాసతాం, మానోహిగ్ంసీ జ్జాత వేదో గామశ్వం పురుషం జగత్, అభిభ్రదగ్న ఆగహి శ్రియా మా పరిపాతయ, సమ్రాజం చ విరాజం చాభిశ్రీ ర్యాచ నో గృహే, లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మాసగ్ం సృజా మసి. సంతత శ్రీరస్తు, సర్వమంగళాని భవంతు. నిత్యశ్రీరస్తు, నిత్యమంగళాని భవంతు. శ్లో. నీరాజనం గృహాణేదం పంచవర్తి సమన్వితమ్, తేజో రాశిమయం దత్తం గృహాణ త్వం సురేశ్వర. శ్రీ సత్యనారాయణస్వామినే నమః, కర్పూరనీరాజనం సమర్పయామి.

మంత్ర పుష్పం : ధాతా పురస్తాద్యముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః, తమేవం విద్వానమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే. ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్, విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్, విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్, విశ్వమేవేదం పురుషస్త ద్విశ్వముప జీవతి, పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్, నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్, నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః, నారాయణ పరం బ్రహ్మతత్త్వం నారాయణః పరః, నారాయణపరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః, యచ్చ కిచిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః అనంతరమవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్, పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్, అధో నిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరి తిష్ఠతి, జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్, సన్తతగ్ం శిలాభిస్తులంబత్యా కోశసన్నిభమ్, తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితమ్, తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః, సోఽగ్రభు గ్విభజన్తిష్ఠ న్నాహార మజరః కవిః, తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సంతతా, సంతాపయతి స్వం దేహ మాపాదతలమస్తకః, తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః, నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లే ఖేవ భాస్వరా, నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా, తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః, స బ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర స్సోక్షరః పరమస్వరాట్, రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే, నమో వయం వైశ్రవణాయ కుర్మహే, సమే కామాన్కామకామాయ వైశ్రవణాయ మహారాజాయ నమః, తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతమ్, తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమింధతే విష్ణోర్యత్పరమం పదమ్. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

## ''యోఽపాం పుష్పమ్''

యోఽపాం పుష్పం వేద పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి
చన్ద్ర మావా అపాం పుష్పమ్ పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
అగ్నిర్వా అపా మాయతనం ఆయతనవా న్భవతి
యోఽగ్నే రాయతనం వేద ఆయతనవా న్భవతి
ఆపోవా అగ్నేరాయతనం ఆయతనవా న్భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
వాయుర్వా అపా మాయతనం ఆయతనవా న్భవతి
యోవా యో రాయతనం వేద ఆయతన వాన్భవతి
అపోవై వాయో రాయతనం ఆయతనవాన్భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
అసౌ వైతప న్నపా మాయతనమ్ ఆయతనవా న్భవతి
యోఽముష్యతపత ఆయతనం వేద ఆయతనవా న్భవతి
అపోవైఆముష్యతపత ఆయతనం ఆయతనవాన్భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
చన్ద్రమానా అపా మాయతనం ఆయతనవాన్భవతి
యశ్చన్ద్ర మస ఆయతనం వేద ఆయతనవాన్భవతి
ఆపోవై చంద్రమస ఆయతనం ఆయతనవాన్భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
నక్షత్రాణి నా అపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
యో నక్షత్రాణా మాయతనం వేద ఆయతనవా న్భవతి
ఆపోవైనక్షత్రాణామాయతనం ఆయతనవాన్భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
పర్జన్యోవా అపా మాయతనం వేద ఆయతనవా న్భవతి
యఃపర్జన్య స్యాయతనం వేద ఆయతనవా న్భవతి
ఆపోవై పర్జన్య స్యాయతనం ఆయతనవాన్భవతి య ఏవం వేద

యోఽపా మాయతనం వేద ఆయతనవాన్ భవతి
సంవత్సరోవా అపా మాయతనం ఆయతనవాన్భవతి
య స్సంవత్సర స్యాయతనం వేద ఆయతనవాన్భవతి
ఆపోవై సంవత్సర స్యాయతనం ఆయతనవాన్భవతి య ఏవం వేద

యోఽప్సు నావం ప్రతిష్ఠితాం వేద

ప్రదక్షిణ నమస్కారాః : శ్లో. యాని కాని చ పాపాని జన్మాంతరకృతాని చ, తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే, పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః, త్రాహిమాం కృపయా దేవ శరణాగతవత్సల, అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ, తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన. ప్రదక్షిణం కరిష్యామి సర్వభ్రమనివారణం, సంసారసాగరాన్మాం త్వముద్ధరస్వ మహాప్రభో. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. ఛత్రం సమర్పయామి, చామరం సమర్పయామి, గీతం శ్రావయామి, నృత్యం దర్శయామి, నాట్యం సమర్పయామి, సమస్తరాజోపచారాన్ సమర్పయామి.

ప్రార్థనా : శ్లో. అమోఘం పుండరీకాక్షం నృసింహం దైత్యసూదనం, హృషీకేశం జగన్నాథం వాగీశం వరదాయకమ్, సగుణంచ గుణాతీతం గోవిందం గరుడధ్వజం, జనార్దనం జనానందం జానకీ వల్లభం హరిమ్. ప్రణమామి సదా భక్త్యా నారాయణమజం పరం, దుర్గమే విషమే ఘోరే శత్రుణా పరిపీడితే. విస్తారయతు సర్వేషు తథానిష్టభయేషు చ, నామాన్యేతాని సంకీర్త్య ఫల మీప్సిత మాప్నుయాత్. సత్యనారాయణం దేవం వందేహం కామదం ప్రభుం, లీలయా వితతం విశ్వం యేన తస్మై నమోనమః. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ప్రార్థనానమస్కారాంత్సమర్పయామి.

ఫలం : శ్లో. ఇదం ఫలం మయా దేవ స్థాపితం పురతస్తవ, తేన మే సఫలావాప్తిర్భవే జ్జన్మని జన్మని. శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ఫలం సమర్పయామి.

శ్లో. యస్య స్మృత్యాచనామోక్త్యా తపః పూజాక్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతం. మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన, యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే. అనయా ధ్యాన ఆవాహనాదిషోడశోపచారపూజయా చ భగవాంత్సర్వాత్మకః శ్రీ సత్యనారాయణ స్సుప్రీతో వరదో భవతు. శ్రీ సత్యనారాయణప్రసాదం శిరసా గృహ్ణామి.

## అథ పూర్ణాహుతి మంత్రాః

ఓం పూర్ణాహుతి ముత్తమాం జుజహోతి సర్వ వైపూర్ణాహుతిః
అస్వాయేమ ప్రతి తిష్ఠతి స్వాహా ఇదం పూర్ణాయ ఇదన్నమమ

## శ్రీ సత్యనారాయణ వ్రతపూజకు కావలసిన వస్తువుల జాబితా

సాధారణ పూజ :

1. శ్రీ సత్యనారాయణ స్వామి పటము 18 అంగుళాల పొడవు 14 అంగుళాల వెడల్పు (కుడిచేయి అభయ హస్తముద్రలోనుండవలయును) లేదా శ్రీ సత్యనారాయణ, లక్ష్మీదేవి, శ్రీ చక్రము, వినాయక ప్రతిమలు (విగ్రహములు)
2. పూలమాల 1, కదంబము 10 మూరలు.
3. 9 రకాల పూలు, తులసి ఎక్కువగా కావలయును. ఒక్కోరకానికి ఒక్క శేరు (తెలుపు, ఎఱుపు, నీలం, ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగులలో)
4. పచ్చ కర్పూరం, కేసరి (కుంకుమపూవు)
5. కొబ్బరికాయలు - 2, అరటి పండ్లు - 12, 5 రకాల ఫలాలు, ఒక్కో రకానికి ఒకటి. బెల్లం - 50గ్రా.
6. జాకెట్టు గుడ్డ - 1, తువ్వాలు - 1.
7. కర్పూరము - 10 గ్రాములు, అగరుబత్తీలు-20, చందనం పొడి -25 పైసలకు, తమలపాకులు-20, వక్కలు-10, ఖర్జూరకాయలు-2, పసుపు కొమ్ములు-2.
8. బియ్యం -1 కె.జి.
9. నువ్వుల నూనె - 1/4 కె.జి.
10. పాలు-2 లీటర్లు, పెరుగు - ఒక కప్పు, నేయి-50 గ్రా., తేనె-ఒక చిన్న సీసా, చక్కెర-1/4 కె.జి., కొబ్బరి నీరు - ఒక కప్పు.
11. అరటి మాకులు - 2 (దొరికితే).
12. చిల్లర - పావలాలు - 5, రూపాయలు -7.
13. కేసరి ప్రసాదం - 1 కె.జి., పులిహోర-1 కె.జి., మహా నైవేద్యం -

అన్నం, కూరలు, సాంబారు (పులుసు), రసం, మజ్జిగ, చట్నీ, ఉప్పు, చక్కెర - 5 లేక 10 దినుసులు.

14. హోమం (హవనం) 300 సమిధలు, నేయి ½ కె.జి.

మహా పూజ :

1. శ్రీ సత్యనారాయణ స్వామి పటము (కుడిచేయి అభయ హస్తముద్రలో నుండవలయును) లేదా శ్రీ సత్యనారాయణ, లక్ష్మీ దేవి, శ్రీ చక్రము, వినాయక విగ్రహములు.
2. పూల మాలలు 3, కదంబము 10 మూరలు.
3. 9 రకాల పూలు (తెలుపు, ఎఱుపు, నీలం, ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగులలో ఒక్కో రకం 2 శేర్లు) తులసి ఎక్కువగా కావలయును.
4. పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు.
5. కొబ్బరి కాయలు-6, అరటి పండ్లు-100, బెల్లం-200 గ్రా. ఒక్కో రకానికి ఐదు చొప్పున ఐదు రకాల పండ్లు.
6. చీర-1, జాకెట్టు గుడ్డ-1, ధోవతులు-2, తువ్వాళ్ళు-2.
7. కర్పూరము-20 గ్రా., అగరు బత్తీలు-50, చందనం (టి.ఎస్.ఆర్.), కుంకుమ-2 రూ., మామిడి ఆకులు-11, తమలపాకులు-250, వక్కలు-1/2 కె.జి., ఎండు ఖర్జూరకాయలు-1/2 కె.జి., పసుపు కొమ్ములు-1/4 కె.జి., ఒక్కో రకానికి 100 గ్రాముల చొప్పున 5 రకాల ఎండు ఫలాలు (డ్రై ఫ్రూట్స్).
8. బియ్యం -3 కె.జీ.లు
9. నువ్వుల నూనె 1/2 కె.జి.
10. పాలు 3 లీటర్లు, పెరుగు-1 కప్పు, నెయ్యి-100 గ్రాములు, తేనె-½ కె.జి., చక్కెర-1 కె.జి.
11. అరటి మాకులు - 2 (దొరికితే)
12. చిల్లర - పావలాలు-5, రూపాయలు-75.
13. కేసరి ప్రసాదం-1 కె.జి., పులిహోర-1 కె.జి., మహా నైవేద్యం - అన్నం, కూరలు, సాంబారు (పులుసు), రసం, మజ్జిగ, చట్నీ, వడ, పాయసం.
14. హోమం-1000 సమిధలు, 1/2 కె.జి. ఆవు నెయ్యి, హవన సామగ్రి, నూవులు, దర్భలు.

# పాత్రలు

1. పీటలు – 4, (భార్యా భర్తలకు, దేవునికి, పురోహితునికి).
2. అభిషేకం – 1 తట్ట, 1 బేసిన్ గిన్నె.
3. ప్లేట్లు (తట్టలు)–5, వినాయకునికి, అక్షతలకు, నివేదన మొ.గు. వానికి.
4. పంచపాత్ర, ఉద్ధరిణి, తట్ట, పెద్ద పాత్రలు, రెండు కలశ పాత్రలు.
5. దీపస్తంభాలు–4 (దీపాలు ఆరిపోకుండా గ్లాసు కవర్లు వుంటే మంచిది).
6. హారతి గరిటె పెద్దది.
7. ఊదు వత్తులు పెట్టడానికి బియ్యంతో నిండిన గ్లాసు.
8. 9 రకాల పూలు వుంచడానికి 9 తట్టలు, మిగతా పూలకు రెండు బుట్టలు.
9. లోటాలు – 6, స్పూన్లు (చిన్న గరిటెలు) – 6.
10. ప్లాస్టిక్ బొక్కెనలు – 3.
11. జగ్‌లు – 2, లోటాలు – 2.
12. వడ్డన గుత్తిలు – 2.
13. గంట, నేతితో తడిపిన 20 దూది వత్తులు.
14. చిన్న కప్పులు – 5.
15. శంఖము (దక్షిణావృతము దొరికితే మంచిది) అభిషేకము చేయడానికి.

పుష్పములు :

| | | |
|---|---|---|
| ఆకుపచ్చ రంగువి | – | తులసి, బిల్వము (మారేడు) |
| ఎఱుపు | – | రోజా, కస్తూరి |
| తెలుపు | – | సంపంగి, మల్లి |
| పసుపు పచ్చ | – | బంతి (చామంతి) |
| నీలం | – | లిల్లీ, శంఖు, నల్ల కలువ |

**64** దేవతలు : గురు–1, గణేశ్–1, యుగళ దేవతలు–6, లోకపాలకులు–5, నవగ్రహములు–27, దిక్పాలకులు–10, వాస్తు పురుషాది దేవతలు–14. ఈ 64 దేవతలను ఆవాహనం చేయాలి. అభిషేకం చేయాలంటే ఒక్కో దేవతకి ఒక్కొక్క లీటరు పాలు కావాలి.

# శ్రీ సత్యనారాయణ మహా పూజ చేయుటకు చేయువలసిన ప్రాథమిక ఏర్పాట్లు

స్థలము : స్వంత ఇంటిలో ఒక పెద్ద హాలుగాని, రూముగాని ఎన్నుకొని దానిని శుభ్రంగావూడ్చి కడగాలి. అందులో చాపలుగానీ, జంఖానాలుగానీ పఱిచి అందరూ తూర్పుముఖంగా కూర్చోవాలి. తూర్పు వైపున్న గోడ దగ్గర 3' x 2' కొలతలు గల పీటను వేసి దాని మీద కొత్తదయిన తెల్ల తువ్వాలును పఱచాలి. దానిమీద దేవుని పటము వుంచాలి. ఆ పటమును తడి గుడ్డతో తుడిచి చందనము, కుంకుమ పెట్టాలి. పూలమాల వేయాలి. దేవుని ముందు ఒక పీట వేసి ఒక కె.జి. బియ్యం చతురస్రాకారంలో నెఱపాలి.

దేవుళ్ళు : వెండితోకానీ, లేదా పంచలోహాలతో చేసిన శ్రీ చక్రము, విఘ్నేశ్వరుడు, శ్రీ సత్యనారాయణస్వామి, శ్రీ అనంత లక్ష్మీదేవి విగ్రహాలు (ప్రతిమలు) కావాలి. విఘ్నేశ్వరుని తడి పసుపుతో కూడా చేసుకోవచ్చు. ఇవన్నీ లేకపోయినా అన్ని పూజలు ప్రధాన కలశానికి చేసుకోవచ్చు.

ప్రధాన కలశము : ఒక లీటరు నీళ్లుపట్టే మరచెంబుగానీ, కూజాగానీ, మరే పాత్రనయినా తీసికోవాలి. దానికి నాలుగు వైపులా చందనము, కుంకుమ బొట్లు పెట్టాలి. ముప్పాతిక భాగం పాత్రను నీటితో నింపాలి. అందులో పచ్చ కర్పూరము, కుంకుమ పూవు, తొమ్మిది లేక ఐదు రకాల పుష్పాలు అన్నీ కొద్ది కొద్దిగా వేయాలి. 11 మామిడి ఆకులు అన్ని వైపులా విచ్చుకొని బయటికి వచ్చేటట్టు పెట్టాలి. మంచి కొబ్బరికాయ తీసికొని దానికి చందనము, కుంకుమలతో నామముపెట్టి ఆ మామిడి ఆకులమీద పాత్రకు మూతలాగా పెట్టాలి. ఆ కొబ్బరికాయ జుత్తుమీద 2 x 2 సైజుగల జాకెట్టు గుడ్డను త్రిభుజాకారముగా మడిచి టోపీలాగా పెట్టాలి. ఆ కలశాన్ని కదంబ పుష్పాల సరంతో అలంకరించాలి.

అక్షతలు : ముక్కపోకుండా వుండే పచ్చిబియ్యం మూడు పిడికిళ్ళు తీసికొని గంగాజలం, తగినంత కుంకుమతో కలిపి దానిమీద కుడి చేయి ఉంచి గాయత్రీ మంత్రం కానీ, నారాయణ మంత్రం కానీ పదిసార్లు చెప్పాలి.

దీపములు : దేవుడుని, కలశము పెట్టిన పీటలమీద నాలుగు వైపులా నాలుగు దీపాలు తమలపాకు మీదవుంచాలి. దీపాలు మంచినూనెతోగానీ, నేతితోగానీ వెలిగించాలి. గాలి వీచినపుడు దీపాలు ఆరిపోకుండా గాజు షేడ్లు (మూతలు) పెడితే మంచిది. ప్రతి దీపానికి చందనం, కుంకుమ పెట్టాలి. ఎఱ్ఱని పూలు అక్షతలు తీసికొని ప్రతి దీపం ముందు పెడుతూ యీ మంత్రం

చెప్పాలి. ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః దీప దేవతాభ్యోం నమః శుభం భవతు మే సదా !

వరుణ కలశం : వెండి లేదా రాగి లేదా స్టీలు లేదా మరొక పాత్రను తీసికొని దానికి నాలుగువైపులా చందనం, కుంకుమ బొట్లు పెట్టి, రకానికి ఒక పూవు చొప్పున 9 రకాల పూలు, ఎక్కువగా తులసి, కొద్దిగా చందనం, పచ్చ కర్పూరము, కుంకుమ పూవు, అక్షతలు అందులో వేసి దాని నిండా గంగాజలంతో కానీ, మామూలు నీటితోకానీ నింపాలి. కుడిచేయి బొటన వ్రేలు అందు ముంచి గాయత్రీ మంత్రం కానీ నారాయణ మంత్రం కానీ పదినిముషాల సేపు వుచ్చరించాలి.

తాంబూలములు : 5 తమల పాకులు, రెండు వక్కలు లేదా వక్కపొడి, ఒక అరటిపండు, రూపాయి నాణెం ఒకటి, ఒక ఎండు ఖర్జూరము, యివన్నీ కలిసి ఒక తాంబూలం అవుతుంది. మామూలు పూజకు అలాంటి తాంబూలాలు 4 కావాలి. ఒకటి గణపతికి, ఒకటి గురువుకు, ఒకటి 64 దేవతలకు, ఒకటి సత్యనారాయణ స్వామికి. ప్రత్యేకంగా గణపతికి 5 పావలా బిళ్లలు, శ్రీ సత్యనారాయణ స్వామికి 5 రూపాయి బిళ్లలు పెట్టాలి. తక్కిన వారికి మాములు.

మహా పూజ : విస్తారంగా చేసే యీ పూజలో 70 తాంబూలాలు పెట్టాలి. ఒక్కోదానిలో మూడు తమలపాకులు, రెండు వక్కలు, ఒక ఎండు ఖర్జూరము, ఒక అరటి పండు, పసుపుకొమ్ము, ఒక రూపాయి నాణెము పెట్టాలి.

నేతి వత్తులు : నేతిలో ముంచిన పది వత్తులు దీపారాధనకు సిద్ధం చేయాలి.

అగరు బత్తీలు (ఊదు వత్తులు) : గ్లాసునిండా బియ్యం పోసి, అందులో అంటించిన 5 అగరు వత్తులుపెట్టి ఆ గ్లాసును దేవునికి కుడివైపున వుంచాలి. మంచి చందనపు బత్తీలు కనీసం 20 అయినా కావాలి.

పూలు–పండ్లు : ఒక్కొక్కటి ఒక శేరు వుండేలా 9 రకాల పూలు, రకానికి కనీసం ఒకటయినా వుండేలా ఐదు రకాల పండ్లు, ఒక కొబ్బరిచిప్ప – ఒక్కొక్క ప్లేటులో వుంచి యిలాంటి తొమ్మిది తట్టలు లేదా గంగాళాలు సిద్ధం చేసుకోవాలి. కొట్టిన కొబ్బరికాయల నీరు ప్రత్యేకంగా వేరే పాత్రలో పోసుకోవాలి.

ఉద్ధరిణి–పంచపాత్ర : గంగతో నింపిన పంచపాత్రను అందులో వుద్ధరిణి (స్పూను) వుంచి, ముందుంచుకోవాలి.

గంట : మ్రోగించే గంటకు చందనము, కుంకుమ బొట్టు పెట్టి, కుడివైపున తమలపాకు మీద పెట్టి పూలు అక్షతలు చల్లాలి.

కర్పూరము : మామూలు పూజలో 4సార్లు, విశేష పూజలో 8సార్లు, హారతి యివ్వాలి. పూజననుసరించి 10 లేక 20 గ్రాముల కర్పూరం సిద్ధంగా వుంచుకోవాలి.

బేసిన్ గిన్నె మరియు సిల్వర్ తట్ట : అభిషేకం చేయడానికి వీటిని సిద్ధం చేయాలి. గిన్నెను నీటితో నింపి వుంచుకోవాలి.

ప్రసాదము : ప్రసాదము అంటే మామూలు కేసరి ప్రసాదము. గోధుమరవ్వ, చక్కెర, నెయ్యి, అరటి పండ్లు, పాలు, జీడిపప్పు, కిస్మిస్ మొ.గు వాటితో చేస్తారు.

మహా ప్రసాదము అనగా **10** దినుసులు : కేసరి, పులిహోర, వడ, పాయసం, అన్నం కూరగాయల దినుసులు, సాంబారు, రసం, చట్నీ లేదా పచ్చడి, పెరుగు లేదా మజ్జిగ.

1. పూజకు వచ్చిన వారందరికీ చందనం, కుంకుమ బొట్లు పెట్టాలి.
2. పూజ అయిన తరువాత అందరికీ పూలు పంచాలి.
3. పంచామృతము, ప్రధాన కలశ–వరుణ కలశ తీర్థములు అందరికీ యివ్వాలి.
4. ప్రసాదం పెట్టాలి.
5. మహా ప్రసాదం, తాంబూలం యివ్వాలి.

లలితా దివ్య సహస్రనామం, పూజకు మునుపు, తరువాత పారాయణం చేయాలి. వచ్చిన వారందరినీ సత్యనారాయణ స్వరూపులుగా ఆదరించి సేవించాలి.

పూజ అనంతరము : ప్రధాన కలశము, వరుణ కలశములలోని నీరు అందరూ త్రాగివేయాలి లేదా బావిలో కుమ్మరించాలి. అన్నీ పూలు పంచివేయాలి. అప్పటికీ మిగిలిపోతే సముద్రములో గానీ, నదిలోకానీ, చెరువులో కానీ, చెట్టు మొదలులో కానీ వేయాలి. పటాన్ని తూర్పువైపు గోడకు తగిలించాలి. ఎందుకంటే సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. సత్యనారాయణుడే సూర్యుడు. అతడు కనిపించే దేవుడు. అంతా అయిన తరువాత గదిని, పాత్రలను శుభ్రం చేసి వుంచుకోవాలి.

ఈ సత్యనారాయణ వ్రతం శ్రీ సద్గురు స్వామి శివానందుల వారి అనుగ్రహం వలన శ్రీ ఓం నారాయణజీ వారు 1950 జనవరిలో ఆరంభించారు. గురువుగారు మొదలు పెట్టమని చేసే విధానం తెలిపారు. ఆ పద్ధతిలో ఈరోజు వరకు నిర్విఘ్నంగా ఈ పూజలు జరుగుతున్నవి. భక్తులు మంచి ఫలితం అనుభవిస్తున్నారు.

ఓం తత్ సత్

# ఓం నారాయణ గారి సంక్షిప్త జీవిత చరిత్ర

'ఓం నారాయణ్' అని ఆయనకు స్వామి శివానంద పేరు పెట్టారు. ప్రేమపూర్వకంగా అందరూ ఆయనను ఓంజీ, లేదా ఓంజీ మహారాజ్ అని పిలిచేవారు. కానీ పూర్వాశ్రమములో ఆయన పేరు ఈమని గోపాలకృష్ణమూర్తి.

గోపాల కృష్ణమూర్తి తండ్రి ఈమని వేంకటేశ్వరులు. తల్లి నాగేంద్రమ్మ. ఆమె కృష్ణ భక్తురాలు అయినందువల్ల, కుమారునికి గోపాల కృష్ణమూర్తి అని పేరు పెట్టుకొన్నది. ఆమె అన్నగారు అనగా గోపాలకృష్ణమూర్తి మేనమామ అప్పట్లో రాజమండ్రి జైలు సూపరింటెండెంట్. జైలులోనే క్వార్టర్సు వుండేవి. ఆ క్వార్టర్సులోనే అనగా జైలులోపలే పుట్టడంవల్ల కూడ ఆ పేరు పెట్టబడిందని చెప్పుకొనేవారు. ఆ విధంగా గోదావరి తీరంలో 19-5-1920లో బుధవారం నాడు ఈమని గోపాలకృష్ణమూర్తి మాతామహుల యింట జన్మించాడు. బుధవారం పుట్టినవారు భూములేలుతారు అంటారు. కానీ ఓం నారాయణగారు భక్తుల హృదయాలు ఏలినారు.

ఐదారు సంవత్సరాల వయసులోనే భగవద్గీత వల్లించడం మొదలుపెట్టినా, నిజానికి అక్షరాభ్యాసం అనే తంతు ఏడవ సంవత్సరము వయసు వచ్చాకనే జరిగింది. ప్రకాశంజిల్లా అమ్మనబ్రోలులో ఇసుకమీద 'ఓం నమశ్శివాయ' అని ఆయన తండ్రిగారే వ్రాసి దిద్దించినారు. అది వ్రాస్తూవుండగానే శివునిలాంటి ఒక సాధువు వచ్చి భిక్ష పెట్టమన్నాడు. గోపాలకృష్ణమూర్తి చేటనిండా బియ్యం పట్టుకొచ్చి పోసినాడు. ''ఇన్ని బియ్యం ఎందుకు ?'' అని సాధువు అడిగినాడు. ''తీసుకపొండి స్వామీ! పోయేటప్పుడు మనమేమయినా పట్టుకపోతామా'' అన్నాడట- ఆ బాలుడు. అహో ! అంతచిన్న వయసులో అంతటి వేదాంతమా? ''నీకు విద్య అనుగ్రహిస్తాను. నీవు మహానుభావుడవుతావు'' అని ఆ సాధువు అనుగ్రహించి ఆశీర్వదించాడు.

ఆ ఆశీర్వాదం అధ్యాత్మికంగానే కాక, లౌకికంగా కూడ పనిచేసింది. రాజమండ్రిలో మేనమామ ఇంట్లోనే వుండి చదువుకొని బి.ఎ. పూర్తిచేశాడు.

1936వ సంవత్సరంలో మద్రాసుకు వచ్చి రైల్వేలో వుద్యోగానికి దరఖాస్తు చేశారు. తిరుగు ప్రయాణంలో సెంట్రల్ స్టేషనులో పుస్తకాల కొట్టులో స్వామి శివానంద వ్రాసిన జపయోగం అనే పుస్తకం కంటబడింది. దాన్ని కొన్నారు. ఆ పుస్తకం చదివి జీర్ణించుకొనే సరికి, రైల్వేలో వుద్యోగం దొరికింది. స్వామి శివానంద దొరికారు. అంటే ఆ రోజుటి నుంచి అంతరంగంలో శివానంద స్వామి

అధిష్టించాడు. ఆ తరువాత ఋషికేశ్‌కు ప్రయాణం చేసి 8-9-1936లో శివానందస్వామికి శిష్యులై ఆ ఋషుల సామ్రాజ్యంలో కలిసిపోయారు. శివానందస్వామి జన్మదినం నాడు శిష్యుడుగా చేరడం గమనార్హం.

గృహస్థ జీవనంలో నుంచే అధ్యాత్మిక జీవనం ఆ రోజుల్లోనే ప్రారంభమయింది. ఋషీకేశ్‌కు యిన్ని ప్రయాణాలు, గురుపాదాల మ్రోల యిన్ని రోజులు, గురువుగారితో సత్సంగము యిన్ని రోజులు అని లెక్కించలేము. ఎప్పుడూ అదే ధ్యాస, అదే యావ, అదే కూడుగుడ్డ, అదే గాలి, నీరు, అదే సామ్రాజ్యం. చివరకు గురువుగారికే చిరాకువేసి 'కాస్త ఇహలోకం కూడా చూడు నాయనా!' అని చెప్పవలసి వచ్చింది.

ఋషీకేశ్‌లో శివానంద ఆశ్రమములో ఎత్తైన వేదికమీద స్వామి శివానంద కూర్చునేవారు. ఆయన పాదాలచెంత భక్తులు, శిష్యులు, ముముక్షువులు, జిజ్ఞాసులు కూర్చుని వుండేవారు. క్రింద గంగానది ప్రవహిస్తూ వుంటుంది. స్వామివారు గంగను చూపిస్తూ అనేవారు - ''ఎంత పుణ్యం, ఎంత పవిత్రం? చూస్తేచాలు జన్మ పునీతమయిపోతుంది. ఇక మునిగితే వేరే చెప్పాలా ? గంగను చూసి తరించండి. వీలయినన్నిసార్లు పుణ్య స్నానాలు చేయండి. అదే జీవిత ధ్యేయంగా వుండాలి.''

స్వామి శివానంద మాటలు మాత్రమే కాదు, చేతలుకూడ ఓంజీని ఆకర్షించేవి. అందుకు తగ్గట్టు ఆయన వైరాగ్యం కూడ అలానే వుండేది. తాను డాక్టరైనా తన శరీరాన్ని గూర్చి ఏమాత్రం పట్టించుకోకపోవడంతో అమిత స్థూలకాయుడై, సమున్నతంగా కనబడేవారు. గుండు గీయించుకొన్న రెండు మూడు రోజులకే తిరిగీ మంగలి ప్రత్యక్షమై ఆ మొలచిన ఒకటి రెండు వెంట్రుకలను కూడ క్షవరం చేసేవాడు. ఈ మహానుభావుని జీవనంతో ఆకర్షింపబడిన ఓంజీ ఋషీకేశ్ ప్రయాణాలు క్రమక్రమంగా ఎక్కువై పోయాయి. ఒక్కోమారు మద్రాసునుంచి నలభై, యాభైమందిని కూడ తీసుకపోయి స్వామి శివానంద దర్శనం చేయించేవారు.

స్వామి శివానంద షష్టాక్షరి మహామంత్రాన్ని కొద్దిగా మార్పుచేసి జపం చేసేవారు. ఓం నారాయణ్ తన భక్తులకంతా అష్టాక్షరి 'ఓం నమో నారాయణాయ' మంత్రాన్ని వుపదేశించేవారు. గురుమంత్రం, శిష్యమంత్రం వేరు అయినా అవి జపం చేసేవారి విశ్వాసం - తీవ్రతను బట్టి ఫలితాన్ని యిస్తాయి.

గురుపరిగ్రహణం జరిగాక, ఓంజీ మహారాజ్‌లో వైరాగ్య తీవ్రత ఎక్కువైపోయింది. ఇప్పటికే ఎక్కువగా వున్న ఋషీకేశ్ యాత్రలు ఇంకా

ఎక్కువైపోయాయి. ఆయనతోబాటు ప్రయాణించే మద్రాసు భక్తుల సంఖ్య కూడా పెరిగిపోయింది. ఒక్కోసారి దారి ఖర్చులకు, చార్జీలకు కూడ తడుముకోవలసి వచ్చేది. అప్పులు కూడ చేయవలసి వచ్చేది. అయినా ఓంజీ తన ప్రయాణాలు మానుకొనేవారు గాదు. ఉద్యోగం అయినా చేస్తాడా లేదా వూడగొట్టుకొంటాడా ? సంసారంలో వుంటాడా ? లేదా సన్యసిస్తాడా? అని సందేహం కలిగేది.

ఈ సందర్భంలోనే ''ప్రాణజీవని'' అనే మాస పత్రికను ప్రారంభించి ఆ వేదాంత జ్యోతిని అందరికీ వుచితంగా పంచిపెట్టేవారు. మరికొన్ని భక్తి వేదాంత చిరుపొత్తాలను ముద్రింపించి అందరికీ వుచితంగా పంచి పెట్టడం చూసి స్వామి శివానంద నిర్ఘాంతపోయారు. లోన సంతోషిస్తూనే పైకి సున్నితంగా మందలించేవారు. ఇక ఈయనతో లాభం లేదనుకొన్నారు ఓంజీ.

ఈలోగా స్వామి ప్రణవానంద సాహచర్యం లభించింది. స్వామి ప్రణవానంద న్యూక్లియర్ ఫిజిక్సులో నిష్ణాతుడైన ఆచార్య జ్ఞానానంద (ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరులో న్యూక్లియర్ ఫిజిక్సుశాఖ సంస్థాపకాచార్యుడు, జగద్విఖ్యాతుడు) శిష్యుడు. ప్రసిద్ధ హిమాలయ పరిశోధకుడు. ఆయన పేరే 'పవిత్ర కైలాస మానసరోవరవాసి'. అలాగంటేనే ఆయనను అందరూ గుర్తు పడతారు. ఆ స్వామి కైలాస పర్వతాన్ని 36సార్లు ప్రదక్షిణం చేశారు. యాభై నాలుగు మైళ్ళు చుట్టుకొలత గలిగిన మానసరోవరాన్ని 33మార్లు చుట్టి పరిశోధించారు. ఆయన వ్రాసిన కైలాస మానసరోవర గ్రంథానికి జవహర్ లాల్ నెహ్రూగారు పీఠిక వ్రాశారు. టిబెట్ పరిశోధన గ్రంథాన్ని కలకత్తా విశ్వవిద్యాలయము వారు ప్రచురించి ఎం.ఎ.జాగ్రఫీవారికి పాఠ్యగ్రంథంగా ప్రామాణీకరించారు. ఇక శ్రీచక్రం మీద ఆయన చేసిన పరిశోధన ''ఎ ట్రీటైస్ ఆన్ శ్రీచక్ర'' అను గ్రంథమై అందరినీ ఆకట్టుకొంది.

స్వామి ప్రణవానంద హిమాలయాలలోని రూపకుండ రహస్యం ఛేదించినారు. యతి అనే మంచుమనిషి అసలు లేనేలేడని వున్నది ఎలుగుబంటి మాత్రమేనని తేల్చారు. చైనా, టిబెట్టు, మన దేశ సరిహద్దులు భారత ప్రభుత్వానికి ఎత్తిచూపి వారిచే పద్మశ్రీ బిరుదు పొందినారు. విక్రమశీల విశ్వవిద్యాలయ శిథిలాలను పరిశోధించారు. కస్తూరి మృగములో కస్తూరి ఎక్కడ దొరుకుతుందో చూపారు. ఇలా ఈ స్వామిని ఆయన గురువుగారైన స్వామి జ్ఞానానందను గురించి వ్రాస్తూపోతే అదొక గ్రంథమవుతుంది.

ఇలాంటి మహాత్మునితోబాటు ఓం నారాయణ్‌గారు 12-6-1946లో కైలాస మానసరోవర యాత్ర చేశారు. ఉత్తర ప్రదేశ్‌లోని తనక్‌పూర్ రైల్వేస్టేషను నుంచి నడక ప్రారంభమయింది. మూడువందల మైళ్లుపోవడం, మూడు వందల మైళ్లు రావడం మొత్తం వెరసి 600 మైళ్లు. ఈ యాత్రలోనే ఆయనకు సహనం, ఓర్పు, నేర్పు ఎక్కువయినాయి. పట్టుదల కూడ ఎక్కువయింది.

నల్లమల అడవులలో, కృష్ణానదీ తీరంలో వెలిసినది శ్రీ శైలక్షేత్రం. శ్రీ మల్లిఖార్జున స్వామి భ్రమరాంబికాదేవి సమేతుడై సమస్త భక్తకోటి అభీష్టాలను నెరవేరుస్తూ ప్రఖ్యాతుడైన పుణ్యస్థలి అది. ఆ కొండల గుహలలో, పాతాళగంగ పరిసరాలలో, భ్రమరాంబికా దేవి సన్నిధిలో వెరసి మొత్తం ఒక సంవత్సర కాలం ఓం నారాయణ్ తపస్సు చేశారు.

అచ్చటికి, నల్లమల సరిహద్దులలోని ఒక గ్రామం నుంచి దంపతులు రెడ్లకుటుంబం వారు దర్శనానికి వచ్చినారు. అప్పుడు ఓంజీ శ్రీ భ్రమరాంబికా ఆలయంలో వున్నారు. ఆ రెడ్ల వనిత నిలువెత్తునా ధరించిన బంగారు నగలు చూసి ఆమెతో అన్నారు ఓంజీ, ''నీవెంతో ధనికురాలివి. ఈ భ్రమరాంబిక దేవి ఎంత పేదదో చూడవమ్మా. చెవుల్లోగానీ, ముక్కుల్లోగానీ ఏమీ లేవు. నీ నగలు యిచ్చావంటే అమ్మవారికి తొడుగుతాను''. ఆ మాటలు వింటూనే, ఆమె వెంటనే తాను ధరించిన నగలన్నిటినీ వలిచి ఓంజీగారికి యిచ్చింది. ఆయన అమ్మవారికి వాటిని ధరింపజేశాడు. ఆ ముచ్చట చూశాడు. ఆది దంపతుల దర్శనం ఆయనకు అప్పుడే లభ్యమయ్యింది. కాస్సేపు తరువాత చూస్తే ఆ దంపతులు అక్కడలేరు. ఆ కీకారణ్యంలో ఆ నగలు వుంచుకోవడం మంచిదికాదని, వెంటనే వాటిని తీసికొని పరుగెత్తి పాతాళగంగ వద్ద ఆ దంపతులను కలిసి నగలన్నిటినీ తిరిగి యిచ్చివేశాడు. ఆ నగలు తీసికొన్నారో లేదో ఆ దంపతులు అదృశ్యమయ్యారు. ప్రక్కవూరు రెడ్లు - యిదంతా వట్టి సంగతి. ఆ వచ్చినవారే ఆదిదంపతులని తెలిసికొని ఆనంద పులకితుడయ్యాడు ఓంజీ.

1948లో జరిగినది ఈ సంఘటన. అప్పట్లో శ్రీశైల క్షేత్రానికి బస్సు సౌకర్యం లేదు. స్వామి తిరుగు ప్రయాణం ఆయనకు అపురూపమైన అనుభవమయింది. అప్పటికి రెండు మూడు రోజులుగా ఆహారంలేదు. పైగా అడవి ప్రయాణం. అమితదూరం నడచి నంద్యాలకు వచ్చారు. ఇక నడవలేని స్థితిలో ఒకరి ఇంటి అరుగుమీద పడిపోయారు. ఆ ఇంటివారు వైశ్యులు. స్వామివారు వస్తున్నారని వారికి ముందే తెలుసునట. భోజనం సిద్ధంచేసి ఆయనకోసమే ఎదురు చూస్తున్నారు. తరువాత స్వామివారిని సేదతీర్చి భోజనం

పెట్టి తమకు భోజనం సిద్ధం చేయమని భగవదాజ్ఞ అయిందని చెప్పేసరికి ఓంజీ అమ్మ దయకు అమితానందం పొందారు.

ఒక్క శ్రీశైలంలోనే కాదు, శ్రీకాళహస్తిలో కూడా అలాగే సాధన చేసి జ్ఞానప్రసూనాదేవి సమేతుడై శ్రీకాళహస్తీశ్వరస్వామి స్వయంగా అన్నం పెట్టేంత వరకు వుపవాసంతో భీష్మించి కూర్చున్నారు. శ్రీకాళహస్తీశ్వరుడు శ్రీ జ్ఞాన ప్రసూనాంబ సమేతుడై కోయదొరల రూపంలో వచ్చి అన్నం పెట్టి ''మేత మెయ్యిరా! పుంజా పోరిగాడా'' అని కూత పెట్టాడు. అలా చూసేసరికి అదృశ్యమయి పోయారు. 1962లో స్వామి అమరనాథ్ యాత్ర చేసి ఆ కోరికా తీర్చుకున్నారు. పవిత్ర కాశీక్షేత్రంలో సాధనలు చేసి కాశీ విశ్వనాథ్ అన్నపూర్ణా దేవీల సాక్షాత్కారం పొందారు. బదరీనాథ్, కేదారీనాథ్‌లకు ఆయన చేసిన యాత్రలు వందకు పైబడి వుంటాయి. ఇక తిరుపతి యాత్రల సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. 1965లో గంగోత్రి, యమునోత్రి, ఉత్తరకాశి ఆయన సాధనలకు నెలవులు. 1972లో అయోధ్యలో సాధనచేసి శ్రీరామ చంద్రుడు సీతా సమేతుడై దర్శనమిచ్చేంతవరకు ఆ చోటు వదలలేదు. ఈ విధంగా ఓంజీ స్వామి కాశ్మీరమునుంచి కన్యాకుమారి వరకు అన్ని పుణ్యక్షేత్రాలు దర్శించారు. వారు రైల్వే వుద్యోగం చేయడంవల్ల పాసులతో వుచిత ప్రయాణసౌకర్యం వలన యివి సాధ్యమయ్యాయి.

1949 సంవత్సరము, జూలై మాసం, గురుపూర్ణిమ పుణ్య దినోత్సవము, ఓంజీగారు ఋషీకేశ్‌లోని స్వామి శివానంద ఆశ్రమానికి గురుదర్శనానికి వెళ్లడం జరిగింది. ఆ రోజు గురువుగారి సమక్షంలో తన సంశయాన్ని యిలా బయట పెట్టారు. ''స్వామీజీ ! నేను మద్రాసునుంచి మీ దర్శనానికి వచ్చినప్పుడల్లా చాలామంది భక్తులు తమతమ యాతనలు, జిజ్ఞాసలు, విన్నపములు అన్నీ చెప్పి, తమకు నివేదించి అందుకు మీరిచ్చే సమాధానం తెలిసికొనిరమ్మని నన్ను వేధిస్తున్నారు. అదంతా మీదగ్గర చెప్పి, మిమ్మల్ని విసిగించి, మీ సమాధానం తీసికొనిపోయి చెప్పడం చాలా కష్టతరంగావుంది. పైగా ప్రతి ప్రయాణంలోనూ యీ తంతు జరుగుతోంది. దీనికి అంతులేనట్టున్నది. నేనేం చేయాలో తోచకుండా వుంది. మీరే చెప్పండి ఏం చేయాలో అదే చేస్తాను.'' అని ఓంజీ చెప్పగానే స్వామి శివానంద కాస్సేపు మౌనం వహించి తరువాత ఇలా అన్నారు.

''నీవు మూడు రోజులు యిక్కడే వుండు, సమాధానం చెపుతాను.'' మూడు రోజులు గడిచింది. ఓంజీని శివానందస్వామే పిలిపించారు. తన కుటీరంలో కూర్చుని యిలాగ సెలవిచ్చారు. ''మద్రాసులో నీవు శ్రీ సత్యనారాయణ

స్వామివారి వ్రతాన్ని వచ్చే జనవరినుంచి (అనగా 1950 సం.) ప్రారంభించి ప్రతి పౌర్ణమికి చేస్తూవుండు. నీవు పిలిచినప్పుడు నేనూ, శ్రీ సత్యనారాయణ స్వామి యిద్దరమూ పలుకుతాము. నీకు బదులు చెప్పుతాము. నీవు భక్తులకు ఆ విషయం తెలియజేస్తే వారి సందేహాలు తీరుతాయి. వారి కష్టాలు తీరుతాయి. కమాన్ ! మార్చ్ ఆన్'' అని ప్రసన్న వదనంతో నవ్వినారట. ఇది గురువు ఆజ్ఞ, సుగ్రీవాజ్ఞకంటే పదిలంగా పాటించబడింది. శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతాలు అప్పటినుంచి నిరభ్యంతరంగా జరుగుతూ వున్నాయి.

ఓంజీగారి శ్రీశైల క్షేత్ర తపోదీక్ష కాలం నుంచీ, ఆయనకు అమ్మమీద ఎనలేని మక్కువ ఏర్పడింది. శ్రీ భ్రమరాంబ దర్శనముతో ఆమెను నిరంతరము దర్శించాలన్న ఆకాంక్ష - భ్రమరమై ఆయన చెవిలో పోరుసలపసాగింది. చివరకు స్వామి పరిపూర్ణ ప్రకాశానంద భారతి మహాస్వామినమః రూపంలో దేవి ఆ కోరిక తీర్చింది. 5-12-1970 తారీఖునాడు బాలాపరమేశ్వరి మహామంత్ర దీక్ష స్వామి పరిపూర్ణ ప్రకాశానంద భారతివారు ప్రసాదించినారు. ఈ మంత్రాన్ని పదిహేను లక్షలసార్లు జపించిన తరువాత ఓంజీకి బాలాత్రిపుర సుందరి దర్శనం లభ్యమయ్యింది. ఆ దర్శనము తరువాత 20-9-1974నాడు శ్రీ విద్యోపాసకులు అయిన మహాస్వామినమః వారు పంచదశి మహామంత్ర దీక్షనొసగినారు. ఆ తరువాత పూర్ణదీక్ష పర మరియు పాదుకాంత దీక్ష పర మహాషోడశీ మహావిద్యను కూడా ఓంజీగారికి నేర్పడంతో ఆయన శ్రీ చక్రనవావరణ పూజలు, లలితా సహస్రనామ పూజలు చేస్తూ వాటి ప్రచారానికి ఎంతో పాటు పడినారు. మొదటిది బాలా త్రిపుర సుందరి, తదుపరి రాజరాజేశ్వరి మహా త్రిపుర సుందరి పరాభట్టారిక. ఆ క్రింద లలితా మహా త్రిపురసుందరి - అనేవారు ఓంజీ.

ఈ పూజలు మొదట విల్లివాకంలోని బాడుగ ఇంట్లో జరుగుతుండేవి. కానీ శ్రీ సద్గురు దేవుల దయవలన శ్రీ సత్యనారాయణ వ్రతము శాశ్వతముగా జరుగుటకు భగవంతుడే ఏర్పాటు చేసినాడు. గోపీలాల్‌జీ నిచాని అనే వ్యాపార వేత్త మూడు గ్రౌండుల స్థలాన్ని శ్రీ శివానంద చారిటబుల్ ట్రస్టు పేరిట రిజిష్టరు చేసి యిచ్చినారు. స్వామివారి ఆధ్వర్యంలో ఆ విధంగా శ్రీ శివానంద చారిటబుల్ ట్రస్టు ఏర్పడి, డివైన్ లైఫ్ సొసైటీ సేవలు చేయడం ప్రారంభించింది. 1975లో రిజిష్టరు కాబడిన యీ స్థలం మద్రాసు చూలైమేడు, గిల్‌నగర్, ఎక్స్‌టెన్షన్ రెండులో శివానంద రోడ్డులో వుంది. 1978లో స్వామీజీ రైల్వే సర్వీసు నుంచి పదవీ విరమణ చేశాక యిక్కడ సర్వహంగులతో భక్తుల

సదుపాయాలకు అనుగుణంగా ఒక భవనం కట్టబడింది. అందులో ఒకవైపు ముచ్చటగా మూడు ఆలయాలు, మధ్య ఆలయంలో మొదటగా 19-5-86నాటి శుభముహూర్తాన శ్రీ సత్యనారాయణ స్వామి విగ్రహ ప్రతిష్ఠ చేశారు - ఓంజీ మహరాజ్.

వీరు మొదటినుంచీ దేవీ పూజాప్రియులు. శ్రీ చక్రము దేవికి ప్రతీక. ఈ శ్రీ చక్రాలు బంగారు, వెండి, రాగి లోహములతో తయారు చేయించి ఎందరో భక్తులకు వారివారి శక్త్యానుసారము పూజచేసి ధరించేలాగ చేశారు. శ్రీ చక్రము విగ్రహరూపంగా తయారుచేస్తే ఆ రూపాన్ని మహామేరు అంటారు. ఓంజీగారు 3 అడుగుల పొడవు, 3 అడుగుల వెడల్పు అంతే ఎత్తుగల మహామేరును నల్లని గ్రానైట్ శిలతో తయారు చేయించి 16-5-91 పుణ్య లగ్నంలో ప్రతిష్ఠించినారు. ఈ ప్రతిష్ఠలో శ్రీ చక్ర పూజాధురంధరులయిన ఓంజీగారి కుమార్తె కుమారి రత్నాంబ ఎంతో కృషిచేసినారు. ఆమె శ్రీవిద్యా మహాశోడశి వుపాసకురాలు. ఈ విధంగా ఆ సత్యనారాయణస్వామికి ఎడమవైపు వున్న మందిరములో అమ్మవారు శ్రీ మహామేరు రూపంలో వెలిసినారు.

1993 మే నెల 23 తారీఖు శుభలగ్నంలో శ్రీ సత్యనారాయణస్వామికి కుడివైపు గురుదేవులైన స్వామి శివానంద విగ్రహ ప్రతిష్ఠ జరిపించినారు ఓంజీ. దానితో స్వామీజీ ఆశ్రమంలో వుద్దేశించిన పనులన్నీ పూర్తయినాయి.

ఓంజీ మహరాజ్ దాతృత్వం చిన్నతనంలోనే వ్యక్తమయిన సంగతి మనం యిదివరకే చదివాము. ఆ ఔదార్యం, వుదారత్వం, దానతత్త్వం, కరుణ, దయ, సాత్త్వికత్వం ఆయనతోబాటు పెరుగుతూనే వచ్చాయి. అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం, విజ్ఞానదానం, విత్తదానం యివన్నీ ఎంతో గోప్యంగా చేసేవారు. ఆయన దానం చేసినట్లు ఆయనకుగానీ, చూస్తున్న వారికిగానీ, చివరకు దానగ్రహీతకు కూడా తెలియరాని విధంగా దానం చేయుటలో ఆయన దిట్ట.

"అలసిపోయి వచ్చారు. స్నానం చేయండి. ఈ బట్టలు కట్టుకోండి. భోజనం చేయండి. చార్జీలు ఎక్కువయి వుంటాయి ఈ డబ్బు వుంచుకోండి. ఇంటికెళుతున్నారుగదా యీ పుస్తకాలు, యీ ప్రసాదం వగైరా తీసికెళ్లండి." ఇలా సాగనంపేవారు. నిజానికి యివి దానంగా తెలిసేవికావు. అయినా లెక్కిస్తే యివన్నీ సర్వదానాలయి కూర్చుంటాయి.

భక్తి గ్రంథాలు, వేదాంత గ్రంథాలు, పురాణాలు, యిలా ప్రజలను సత్ప్రవర్తనకు పురికొలిపే గ్రంథాలను ప్రచురించే వారికి యితోధికంగా

సహాయం చేసేవారు. ఈ విధంగా సహాయం అందించగలిగిన అవకాశం యిచ్చినందుకు వారిని మెచ్చుకొనేవారు. రాజమండ్రి, భాగవత మందిరకర్తయగు శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారు యీ విషయంగా చేస్తున్న కృషిని అభినందించేవారు. ఆయన భక్తి వ్యాప్త ప్రచురణ వుద్యమంలో ఓంజీగారు కూడా పాలుపంచుకొన్నారు.

స్వామి ప్రణవానంద ఆంగ్లంలో వ్రాసిన పరిశోధక గ్రంథం "A Treatise on Srichakra ప్రచురణ కాకుండానే స్వామి పరమపదించగా, భక్తులు ఆందోళన చెందగా, ఓంజీగారు నడుముకట్టి, ముందు నిలబడి, తనవంతు సహాయం తానుచేసి అందరి భక్తులచేత 50 వేల రూపాయలు సహాయం చేయించి, దానిని ప్రచురించి, అందరికీ పంచిపెట్టారు.

ఓంజీగారు పంచసూక్తులు ప్రవచించేవారు 1. ఆదాయములో 1/10 వంతు ధర్మం చేయండి. 2. భోజనములో 1/10 వంతు జీవ జంతువులకు పెట్టండి. 3. మీ గృహములో 1/10 వంతు దేవునికి వినియోగించండి. 4. మీ వస్త్రములో 1/10 వంతు ధర్మం చేయండి. 5. ఇతరుల కష్టములలో 1/10 వంతు పాలుపంచుకోండి. మనకు వున్న సమయములో 1/10 వంతు దైవ ప్రార్థనకూడా చేయాలని స్వామీజీ చెప్పేవారు. ఇవికాక తల్లిదండ్రులను, గురువును, అతిథిని, దేవుని సమాన భావముతో, భక్తితో పూజించమని ప్రబోధించెడివారు. తాను బోధించడమేగాదు. స్వయంగా ఆచరించి చూపేవారు.

ఓంజీగారు పరమ దయాళువు. అందరిలోనూ దైవాన్ని చూసేవారు. తన పాదాలకు మ్రొక్కేవారి పాదాలను తాను స్పృశించి వారికి తనకూ తేడాలేదని తానుకూడా వారిలాగానే సామాన్యుడని నిరూపించేవారు. తాను వ్రాసే జాబులలో ''నమో నారాయణాయ భగవాన్! నీ పవిత్ర పాదాలకు నా సాష్టాంగ నమస్కారాలు'' అని ప్రారంభించి – నేనూ నీలాంటి ఆత్మనేనని – ముగించేవారు.

ఋషికేశ్‌కు 23 కి.మీ. దూరంలో దేవప్రయాగ్ మార్గంలో వశిష్ఠ గుహవుంది. అది రస్తాకు దిగువన లోయలో గంగానది ఒడిలో వుంది. భారీ శరీరుడయిన ఓంజీ ప్రయాసతో ఆ లోయలోకి దిగేవారు. వశిష్ఠ మహాముని తపస్సు చేసిన ఆ గుహలోని స్ఫటికలింగాన్ని పూజించి అక్కడే స్థిరనివాసం వుంటున్న సాధువులకు సహాయమందించి ఎంతో ప్రయాసతో పైకి ఎక్కివచ్చి బస్సులో ఋషీకేశ్ చేరుకొనేవారు. ఋషీకేశ్‌కు వెళ్లినప్పుడల్లా వశిష్ఠగుహను తప్పక దర్శించేవారు. వెళ్లలేని సమయాలలో సాధువులకు సహాయం

పోస్టుద్వారా ప్రతిమాసం పంపేవారు. ఒక్కోసారి ఆయన దానాలు శ్రుతిమించి, ఆయన కుమార్తె రత్నాంబకు చిరాకు కలిగించేవి. అయినా ఆయన మానుకొనేవారుకాదు. చివరకు రత్నాంబకుకూడ తండ్రి అడుగుజాడలలో నడవక తప్పలేదు.

16వ ఏటనుంచీ ఓంజీ జిజ్ఞాసువై, ముముక్షువై యావత్భారతావనిని తిరిగి ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలన్నింటినీ దర్శించి ఎందరో మహానుభావులను సేవించి, గురుకృపతో తాను తరించి, తన దరిచేరిన వారినందరినీ తరింపజేసినారు. క్షీణదశలో నున్న ఎన్నో కుటుంబాలను, పరిశ్రమలను, కర్మాగారాలను తన సత్యనారాయణ పూజలతో వుద్ధరించి బాగు పరిచినారు. ఆపదలో నున్న ఎన్నో సంసారాలను ఓదార్చి ఒక దరికి చేర్చినారు. ఆయన సాహచర్యం, సన్నిహితము పొందినవారెంతో ధన్యులు.

ఇక్కడ స్థాపించిన శివానంద చారిటబుల్ ట్రస్టు ఆశ్రమములో తల్లి రూపములో శ్రీచక్ర మహామేరు వున్నది. తండ్రి రూపములో శ్రీసత్యనారాయణస్వామి వున్నారు. గురువు రూపములో శ్రీ శివానందస్వామి వున్నారు. మీ అందరి రూపములో నేనున్నాను (ఓంజీ) ఇక మీకు భయమెందుకు? అని ఆయన అందరికీ ధైర్యం చెప్పేవారు. తల్లిలాగ సేదతీర్చి స్నేహితునిలాగ ఆదరించేవారు.

1950 జనవరి పౌర్ణమినాడు ఆయన శ్రీసత్యనారాయణస్వామి వ్రతాలను ప్రారంభించి 1995 జనవరి వరకు నిరవధికంగా చేశారు. ఈ 45 సంవత్సరాలలో ఆయన చేసిన వ్రతాలు 550 పౌర్ణమి పూజలు అవుతాయి. ఆ క్లుప్త వ్రతవిధానాన్ని ఆంగ్లంలోనూ, తెలుగులోనూ కరపత్రాలు వేయించి అనేక వేలమందికి పంచిపెట్టారు.

1995 సంవత్సరం ఫిబ్రవరి నెల 12 తారీఖు ఆదివారం ఉదయాత్పూర్వం 3 గం. సమయంలో (ప్రభవనామ సంవత్సరం ఉత్తరాయణ పుణ్యకాలం, ఏకాదశి ద్వాదశిల సంధి సమయం, తన జన్మ నక్షత్రం నాడే) తనువు చాలించి శ్రీసత్యనారాయణస్వామిలో ఐక్యమయినారు.

మరణానంతరము ఆయనను దర్శించిన వారికి ఆయన నిద్రపోతున్నట్టు ప్రశాంత వదనంతో కనిపించడం ఆశ్చర్యం గొలిపింది. ప్రస్తుత శ్రీశివానందాశ్రమము (డివైన్‌లైఫ్ సొసైటీ) అధ్యక్షులయిన శ్రీ చిదానందస్వామి 13వ తారీఖు ఓంజీగారి భౌతిక కాయానికి శ్రద్ధాంజలి ఘటించి తామిద్దరూ

శ్రీశివానందస్వామికి ప్రత్యక్ష సోదర శిష్యులని ఓంజీగారి ఘనతను కొనియాడి సాష్టాంగ నమస్కారం చేసినారు. ఆ తరువాత అంతిమయాత్ర ప్రారంభమయింది.

మునుపటికంటే ఏమీ తీసిపోని విధంగా స్వామీజీ కుమార్తె కుమారి రత్నాంబ, శ్రీచంద్రనారాయణశర్మ సహాయంతో వ్రతాలు పూజలు పునస్కారాలు కొనసాగిస్తుండడం ఎంతో ముదావహం.

స్వామీజీ వుపదేశించిన మంత్రాలు, శ్రీసత్యనారాయణస్వామి పూజావిధానం - యిక్కడ ప్రచురిస్తున్నాం. వీటిని వుపయోగించుకొని తరించగలరు.

## మృత్యుంజయ మంత్రం

ఓం త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం
ఊర్వారుక మివ బంధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్.

## గాయత్రీ మంత్రం

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్

## ప్రతిదినము పఠించవలసిన మంత్రములు

1. ఓం గం గణపతయే నమః లేక శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానాయ స్వాహ.
2. గాయత్రీ మంత్రం.
3. ఓం నమో భగవతే శ్రీశివానందాయ లేక ఓం గుం గురుభ్యో నమః.
4. విష్ణు సహస్రనామ పారాయణం.
5. లలితా సహస్రనామ పారాయణం.
6. శ్రీం హ్రీం క్లీం శ్రీ మహాలక్ష్మైనమః.
7. ఓం హం హనుమతే నమః
8. ఓం నమో నారాయణాయ.
9. మృత్యుంజయ మంత్రం.
10. ఐం క్లీం సౌః లేక ఓం నమఃశివాయ ఓం నమఃశివాయ.